# నార్లవారి మాట

[పద్య సంపుటి]

రచన

నార్ల వెంకటేశ్వరరావు

౨

ప్రథమ ముద్రణ
2,000 ప్రతులు
డిసెంబర్, **1956**

ప్రకాశకులు:
నార్ల వారు
4 పైక్రాఫ్ట్స్ ఫస్ట్ స్ట్రీట్
రాయపేట :: మద్రాసు 14

# మ న వి

జీవితాన్ని గురించి, సంఘాన్ని గురించి, సాహిత్యాన్ని గురించి, నా అభిప్రాయాలను, నా అనుభవాలను ఈ పద్యాలరూపంలో వ్యక్తీకరించడానికి ప్రయత్నించాను. "ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక"లో అప్పుడప్పుడు వెలువడుతూ వచ్చిన ఈ పద్యాలను చదివిన కవులు, పండితులు, పిన్నలు, పెద్దలు, మిత్రులు, ఇతర సహృదయులు పుస్తకరూపంలో ప్రకటించవలసిందిగా సూచించినందువల్లనే ఆంధ్ర పాఠక లోకానికి నా ప్రథమ పద్యసంపుటిగా దీన్ని అందిస్తున్నాను.

నా అనుభవాలు నావే కావచ్చు; నా అభిప్రాయాలతో కొందరు ఏకీభవించకపోవచ్చు. అయినా, వాస్తవిక జీవితానుభవాలనే ఇందు పొందుపరచానని, చిత్తశుద్ధిపూర్వకమైన అభిప్రాయాలనే వెల్లడించానని నా మనవి. ఈ పద్యాలలో అక్కడక్కడ పరస్పర విరుద్ధాలైనవి వుంటే, జీవితం ద్వంద్వాతీతం కాదని, విరుద్ధాభిప్రాయాలు విధిగా సత్యేతరాలు కావక్కరలేదని నా విజ్ఞాపన.

నాలుగైదు సంవత్సరాలనాడు యాదాలాపంగా ఈ పద్యరచన ప్రారంభించాను. అప్పటితోనే విడిచిపెట్టక ఇంతవరకు ఈ కృషి కొనసాగించడానికి వేమనకవి రచనపట్ల నాకు కుదురుకొన్న భక్తి గౌరవాలే ప్రధానకారణం. ఆయన పద్యాలను పదేపదే చదువుతూ వచ్చినందువల్ల ఆయన ప్రయోగాలు నాకు తెలియకుండానే అక్కడక్కడ దొర్లినవేమో చెప్పలేను. ఇంతే జరిగివుంటే, నేను క్షమార్పణ కోరవలసిన అగత్యం లేదు. మొత్తం పద్యాలన్నీ ఆయన చలువతో వ్రాసినవే :

ఈ పద్యాలన్నీ ఒకే స్థాయిలో లేవని నాకు తెలుసు. వీటిలో నాకు బాగా నచ్చినవి వున్నాయి; అంతగా నచ్చనివీ వున్నాయి. అయితే, నాకు నచ్చినవి ఇతరులకు అంతగా నచ్చకపోవడం, ఇతరులకు నచ్చినవి నాదృష్టిలో అంత మంచివిగా కనబడకపోవడం తటస్థించింది. అందువల్లనే మొత్తంగా అన్నింటినీ—వ్రాసిన ప్రతిదాన్నీ కాదు గాని, నాకు ఒక మాదిరిగా నచ్చినవాటిని కూడా—ప్రచురించాను. వీటిలో ఏ పది పద్యాలు వ్యాప్తిలోకి వచ్చినా నేను కృతార్థుడనైనట్లే భావిస్తాను.

కాగా, పండితుల కొక మనవి: ఈ పద్యాలలో పరభాదేశయడాగమాదులు శ్రావ్యత ననుసరించే ఉపయోగించాను. రూఢాలైన వ్యావహారిక పదాలను, మిశ్రమసమాసాలను అక్కడక్కడ వినియోగించ

డానికి సందేహించ లేదు. మొత్తంపైన వ్యాకరణ నిబంధనలకు కాక, అర్థసౌలభ్యానికి, సౌకుమార్యానికి ప్రాధాన్య మిచ్చాను.

చిన్నయసూరికి కొన్ని చోట్ల చికాకు కలిగించినందుకు కొందరు పండితులు నన్ను ఆక్షేపించినా, జన బాహుళ్యం ఈ సంపుటిని ఆదరిస్తే, ఎప్పటికైనా దీన్ని పద్యసహస్రం చెయ్యడానికి ప్రయత్నిస్తాను.

—రచయిత



నిలుచుకొనగ స్వేచ్ఛ వెచ్చ మేమియు కాదు ;
కొలిచి తెచ్చుకొనగ కూలి కాదు :
గెలుచుకొన్న పిదప నిలుపుకొన్నదె స్వేచ్ఛ
వాస్తవమ్ము నార్లవారి మాట

ఆరగింప స్వేచ్ఛ క్షీరాన్నమూ కాదు ;
అధివసింప కాదు హర్మ్యమైన :
దూరయానమందు ధ్రువతారయే స్వేచ్ఛ
వాస్తవమ్ము నార్లవారి మాట

స్వేచ్ఛ యన్నచో యథేష్టవర్తన కాదు ;
నిక్కమైన స్వేచ్ఛ నియతి గలదె :
నియతిలేని స్వేచ్ఛ నిప్పుతో చెర్లాట
వాస్తవమ్ము నార్లవారి మాట

క్రొత్త స్వేచ్ఛతోడ క్రొత్త బాధ్యత వచ్చు ;
నిష్ఠ వలయు దాని నిర్వహింప ;
నిష్ఠలేని స్వేచ్ఛ నిర్వీర్యమైపోవు
వాస్తవమ్ము నార్లవారి మాట

స్వేచ్ఛ కేవలమ్ము విచ్చలవిడియైన
పిచ్చికుక్క నేల మెచ్చుకొనరు ?
నిగ్రహమ్ము గలదె నిర్దిష్టమైన స్వేచ్ఛరా !
వాస్తవమ్ము నార్లవారి మాట

పరుల స్వేచ్ఛ కొక్క ప్రతిబంధకమ్ముగా
నిలువరాదు సుమ్ము నీదు స్వేచ్ఛ :
పంచుకొనని స్వేచ్ఛ కుంచుక పోవును
వాస్తవమ్ము నార్లవారి మాట

వివిధజనులమధ్య స్వేచ్ఛానుభూతిలో
హెచ్చు తగ్గు లుంట మెచ్చరాదు :
సమముకాని స్వేచ్ఛ శాపమ్ము కానేర్చు
వాస్తవమ్ము నార్లవారి మాట

చిల్లిగవ్వపాటి చేయదు మీ స్వేచ్ఛ
సభను దీర్చు హక్కు సమ మెనేని ;
సభయె పుట్టినిల్లు స్వాతంత్ర్యలక్ష్మికి
వాస్తవమ్ము నార్లవారి మాట

ప్రజల కుండవలెను పరిపాలకులనైన
దుయ్యబట్టగల్గు దొడ్డ హక్కు :
భంగపడును స్వేచ్ఛ వాగ్బంధ మున్నచో
వాస్తవమ్ము నార్లవారి మాట

పరులవాద మెంత పనికిమాలినదైన
స్వేచ్ఛ వలయు దాని జెప్పుకొనగ :
పరుల గొంతునొక్కు టురిశిక్ష స్వేచ్ఛకే
వాస్తవమ్ము నార్లవారి మాట

స్వేచ్ఛ లేదు, వోటు స్వేచ్ఛగా పడకున్న ;
స్వేచ్ఛ లేదు, సభల స్వేచ్ఛ లేక ;
స్వేచ్ఛ లేదు, చర్చ స్వేచ్ఛగా జరుగక
వాస్తవమ్ము నార్లవారి మాట

వేయికండ్లతోడ రేయింబవళ్ళును
కావకున్న స్వేచ్ఛ చేవ దక్కు;
చేవలేని స్వేచ్ఛ శిర సెత్తుకొనలేద
వాస్తవమ్ము నార్లవారి మాట

స్వేచ్ఛ నిరసించు జీవచ్ఛవాలుగా
ప్రజలు పెక్కుమంది బ్రతుకు నీడ్వ;
స్వేచ్ఛ దీప్తమౌ సుభిక్షమ్ము తోడైన
వాస్తవమ్ము నార్లవారి మాట

వివిధ శుభము లిచ్చి విలసిల్లవలె నన్న
స్వేచ్ఛ కుండవలెను సృజనశక్తి;
కాయనట్టి చెట్టు కాల్చనా, కూల్చనా?
వాస్తవమ్ము నార్లవారి మాట

జాతి నిద్ర చెంద స్వాతంత్ర్యభాగ్యమ్ము
కర్పూరమ్ము పగిది కరగిపోవు;
సతత జాగరమ్మె స్వాతంత్ర్య మూల్యమ్ము
వాస్తవమ్ము నార్లవారి మాట

పారతంత్ర్యమందు పాయసాన్నముకంటె
గంజి మేలు స్వేచ్ఛ గల్గెనేని;
స్వేచ్ఛలేని సుఖము ప్రచ్ఛన్ననరకమే
వాస్తవమ్ము నార్లవారి మాట

ఈ విశాలధాత్రి నే యొక్క నరుడైన
దాస్యబాధలోన దవిలెనేని
విశ్రమింపలేరు స్వేచ్ఛానురక్తులు
వాస్తవమ్ము నార్లవారి మాట

వేయి వ్రయ్యలయ్యు స్వేచ్ఛాపతాకమ్ము
వేయి ఛేతుల వినువీథి కెగసి
ధిక్కరింప నేర్చు ముక్కంటివైనను !
వాస్తవమ్ము నార్లవారి మాట

స్వర్గలోకమందు పారతంత్ర్యముకంటె
నరకమందు స్వేచ్ఛ మెఱుగు సుమ్ము ;
ఈడు లేదు స్వేచ్ఛ కీరేడులోకాల
వాస్తవమ్ము నార్లవారి మాట

సమతలేని స్వేచ్ఛ సార్థక్యమందదు,
స్వేచ్ఛలేని సమత శీర్ణమౌను :
శ్రీలు పొంగు ధాత్రి స్వేచ్ఛాసమత లున్న
వాస్తవమ్ము నార్లవారి మాట

ఎట్లు నడచు బండి యెత్తుపల్లములందు
కుదుపు లేక, యెచటొ కూలిపడక ?
సమతలేని చోట స్వాతంత్ర్య రథ మిట్లె !
వాస్తవమ్ము నార్లవారి మాట

సమత యనగ భువిని చదునుచేయుట కాదు ;
ఒకరి కొకరు వట్టి నకలు కాదు ;
సమత యనగ సర్వజన సమాదరణంబు
వాస్తవమ్ము నార్లవారి మాట

జాతి మత కులాది సకలభేదమ్ములు
విఱిగిపోవు సమత విరిసినంత :
సమతలేని జగతి యమలోక సమమురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

సంస్తవింపలేక సమతాయుగమ్మును
వగవ నేల సత్యయుగముకొఱకు ?
సమత యొకటె నేటి సత్యసూత్రము గాదె ?
వాస్తవమ్ము నార్లవారి మాట

రాజు పోయె, అతని రాణువ పోయెను ;
నంబి పోయె, అతని చెంబు పోయె ;
సార్వభౌము డయ్యె సామాన్యపౌరుడు
వాస్తవమ్ము నార్లవారి మాట

అధికసంఖ్య ప్రజల "నలగాజన" మటంచు
త్రోసివేయగల్గు రోజు పోయె :
సాగు నిపుడు ప్రభుత సంఖ్యాబలముతోనె !
వాస్తవమ్ము నార్లవారి మాట

ప్రజలరాజ్యమందు పౌరుల ప్రభువులు ;
ప్రజలరాజ్య బలము పౌరబలము ;
ప్రజలరాజ్య మన్న ప్రతిఘాతి లేదురా !
వాస్తవమ్ము నార్లవారి మాట.

వోటు బలములేక కోటల పాగాను
వేయజాల డెట్టి వీరుడైన :
రాచబాట వోటె రాజ్య మేలగ నేడు
వాస్తవమ్ము నార్లవారి మాట

వోటు కున్న దోయి లోటుపాటుల దీర్చ
నేటి సంఘమందు మేటి బలిమి :
చేటు దెచ్చు వోటు పాటకు బెట్టగా
వాస్తవమ్ము నార్లవారి మాట

వోటు ఉన్నవనుచు పేటురేగినవాడు
చేటు దెచ్చుకొనును చేతులార :
వోటు లిచ్చువారె చేటకొట్టగలరు
వాస్తవమ్ము నార్లవారి మాట

తీరుతెన్నులేక ఫీరిని, వారిని
ఎన్నుకొన్న తిప్ప లెన్నొ వచ్చు :
ఎనుము నెన్నుకొన్న నే పాటి దున్నురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

ఎన్నికైనవార లేబ్రాసులైనచో
తన్ని వేయ తిరిగి యెన్నుకుండు
సన్నగిల్లు స్వేచ్ఛ యెన్నిక లేకున్న
వాస్తవమ్ము నార్లవారి మాట

పదవి పదవి యనుచు పలవరించు నరుడు
ప్రజలదృష్టి నెంతొ పలుచబడును :
కూర్చగలవు కీర్తి కోరని పదవులే
వాస్తవమ్ము నార్లవారి మాట

పదవివిలువబట్టి పదిమంది దరిజేర
అదిరిపాటు కూడ దంతలోనె :
పలుకరింప రెవరు పదవి పోయిననాడు
వాస్తవమ్ము నార్లవారి మాట

ఆత్మ నమ్మి పదవి నార్జించు మానిసి
పదవి నిలుపుకొనగ ప్రజల నమ్మ :
పదవి బానిసీడు పరమునే తెగనమ్మ
వాస్తవమ్ము నార్లవారి మాట

అబ్బగానె పదవి ఉబ్బి తబ్బిబ్బులై
బొబ్బరించువాడు దెబ్బ తినును :
నిబ్బరించువాడె నిల్కడగా నుండు
వాస్తవమ్ము నార్ల వారి మాట

పదవితోనె చెల్లు పదవి తెచ్చు ఘనత
పిదప మిగులు నోయి మొదటిరూపు :
తోలుబొమ్మ శోభ తూరుపారక ముందె
వాస్తవమ్ము నార్ల వారి మాట

ఘనత దెచ్చు నొకడు తన కిచ్చు పదవికి ;
పదవివల్ల ఘనత బడయు నొకడు ;
గంగ గలుపు నొకడు ఘనమైన పదవినే
వాస్తవమ్ము నార్ల వారి మాట

ఆశ్రయింపనేగ రధికారశూన్యమౌ
పదవి నధివసించు ప్రముఖునైన:
స్వామిలేని గుడికి సాగిలబడుదురా?
వాస్తవమ్ము నార్లవారి మాట

పదవి నిలుపుకొనుటె పరమ లక్ష్యంబైన
వ్యక్తి పన్ను నేకుయుక్తినైన:
వ్యసనమైన పదవి వ్యక్తినే కబళించు
వాస్తవమ్ము నార్లవారి మాట

మంత్రి పదవి ప్రజల మతియింత సేవించి
పేరు పొందనొక్క దారె కాని,
మంత్రి పదవిలోనె మాన్యత లేదోయి!
వాస్తవమ్ము నార్లవారి మాట

ఆలి నేలలేని అసమర్థు డెట్లౌను
ప్రజల నేలగల్గు ప్రాజ్ఞవరుడు?
ప్రాకలేని బుడత పరుగెత్త నేర్చునా?
వాస్తవమ్ము నార్లవారి మాట

వరము లిచ్చు మంత్రి వశవర్తియైనచో
కామధేను వేల లేమి దీర్ప?
వరము లిచ్చు మంత్రి వరహాలమూటరా!
వాస్తవమ్ము నార్లవారి మాట

మంత్రి చేయలేని తంత్రమ్ము నైనను
మాటలోనె చేయు మంత్రిసఖుడు:
మంత్రిమిత్రుడైన మంత్రిత్వ మేలరా
వాస్తవమ్ము నార్లవారి మాట

చవటకూడ తానె సర్వజ్ఞుడైనట్టు
మంత్రియయ్యేనేని మాటలాడు :
పదవి యబ్బినంత పాండిత్య మబ్బునా
వాస్తవమ్ము నార్లవారి మాట

అవిటివాని కేల అభినయశాస్త్రమ్ము ?
చెవిటివాని కేల కవులగోష్ఠి ?
మొప్పె కేల రాష్ట్ర ముఖ్యమంత్రి పదః
వాస్తవమ్ము నార్లవారి మాట

చేతవాతకాని చింబోత్తుకైనను,
చదువు సంధ్యలేని చవటకైన
మంత్రిపదవి యన్న మనసు వెంపరలాడు
వాస్తవమ్మువారి నార్లమాట

మంత్రియైననాడు మన్నన లందును ;
పదవి పోయినంత పలుచబడును :
"పంచ"రైన "ప్లైరు" పదవిపోయిన మంత్రి
వాస్తవమ్ము నార్లవారి మాట

సేవ చేయువాడు చెల్లడు ధరలోన ;
నటన చేయువాడె నాయకుండు :
గంగిరెద్దె సుమ్ము ఘనతతో నూరేగు
వాస్తవమ్ము నార్లవారి మాట

నాయకుండు శ్రీవినాయకుం డైనచో
నిండబోదు వాని దండి బొజ్జ :
తిన్నకొలది వాని తిండిరంధి పెరుగు
వాస్తవమ్ము నార్లవారి మాట

రోటి కొక్క పాట, కోటి కొక్క నిజము,
సాటివారిపైని చాటుదెబ్బ :
ఏటి కింక జెప్ప మేటి నాయకు డంచు ?
వాస్తవమ్మ నార్లవారి మాట

మాటనేర్పుతోడ "మసిపూసి మారేడు
కాయ" నిట్టె చేయగల్గువాడె
తేజరిల్లు సుమ్మ రాజకీయములందు !
వాస్తవమ్మ నార్లవారి మాట

ముందు వెనుక లరసి పొందుగా ప్రజలను
నడపలేనివాడు నాయకుండె ?
గుడ్డి గొల్ల యెట్లు గొఱ్ఱెల గాపాడు ?
వాస్తవమ్మ నార్లవారి మాట

పట్టు విడుపు లెఱిగి, కట్టడి చెడకుండ,
గట్టి చిక్కునైన నెట్టివేయు
దిట్టతనము లేక దేశనాయకు డౌనె ?
వాస్తవమ్ము నార్లవారి మాట

బంధువర్గమన్న పక్షపాతము చూపు
నాయకుండు సేయు న్యాయ మున్నె ?
మొగ్గుచూపు త్రాసు మోసము చేయదా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

రంగు మార్చుచుండు రాజకీయజ్ఞుండు
భంగపుచ్చి, ప్రజల గంగ గలిపి
"తింగు రంగ" యనుచు తీవిగా దిరుగురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

సందు దొరికెనేని సడియు చప్పుడు లేక
మేత మేయువాడు నేత యగునె ?
చేను మేయు కంచె సేమమ్ము నరయునా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

కులము పేరు చెప్పి బలము కూర్చుకొనెడి
కుటిల రాజనీతి కోవిదుండు
కులము గొంతు గోసి కూర్చుండు గద్దెపై
వాస్తవమ్ము నార్లవారి మాట

తెగువ జంపి, జాతి తెలివి తేటలు చంపి,
చెలిమి చంపి, బ్రతుకు విలువ చంపి
నిలువున దిగమ్రింగు కులవిభేద పిశాచి
వాస్తవమ్ము నార్లవారి మాట

కులవిభేద మనెడి బలిపీఠసన్నిధి
నరుడె నరుని పట్టి నఱుకుచుండు :
క్రూరుడౌను నరుడు కులతత్వ మున్నచో
వాస్తవమ్ము నార్లవారి మాట

సోషలిజము లేదు, సోదరత్వము లేదు
కులపిశాచి మంట గలియకున్న :
వత్స మెట్లు పెరుగు వ్యాఘ్రమ్ము సరసనే ?
వాస్తవమ్ము నార్లవారి మాట

కులము తక్కు వనుచు చులకన సేయగా
కర్ణునంతవాడె కత్తిగట్టె :
కులవిభేదమందె కలహబీజము లుండు
వాస్తవమ్ము నార్లవారి మాట

విలువకట్టరాదు కులగోత్రములబట్టి ;
కులము తక్కువైన దులువ కాడు ;
గొప్ప రాదు ఋషులగోత్రజు డైనంత
వాస్తవమ్మ నార్లవారి మాట

నలిగిపోవ జాతి కులభేదములమధ్య
చెలిమి లేదు, మనకు కలిమి లేదు :
చెలిమి కలిమి లేక బల మెట్టులుండురా ?
వాస్తవమ్మ నార్లవారి మాట

కులము లేకపోట కలిధర్మమైనచో
సాగుచున్న దిపుడె సత్యయుగము :
సర్వసమ యుగమ్మె సర్వోత్తమమ్మురా !
వాస్తవమ్మ నార్లవారి మాట

తనయు వృద్ధి గోరి తండ్రి తలచుచుండు
కలదు ముందు మంచి కాల మనుచు :
ముందు కలి యటంచు మూర్ఖు డెవ్వడొ చెప్పె !
వాస్తవమ్ము నార్లవారి మాట

నడచి యుండవచ్చు నాల్గు పాదములపై
నుర్వి ధర్మము కృతయుగమునందు :
నరుడె నడచె నపుడు నాల్గు పాదములపై
వాస్తవమ్ము నార్లవారి మాట

యుగము లనుచు నరుని యుత్తలెక్కలె కాని
వేల లనుచు లేవు కాలగతికి :
ఆది లేదు, దాని కంతమైనను లేదు
వాస్తవమ్ము నార్లవారి మాట

వాస్తవమ్ము....

నిన్న పోయె ననుచు నిట్టూర్పు వెందుకు ?
నిన్న నీల్గకున్న నేడు లేదు ;
నేడు పండకున్న నింగి వెల్గదు రేపు
వాస్తవమ్ము నార్లవారి మాట

సడలిపోవుచుండె సంప్రదాయ మనుచు
సణుగు వెనుకనుండి ఛాందసుండు :
సంప్రదాయ మినుపసంకెల కారాదు
వాస్తవమ్ము నార్లవారి మాట

ఆదియుగమునందు వేదఋషుల మించు
జ్ఞానవేత్త లొరులు కానరారు :
నేటి యుగము వేరు, నేటి ఋషులు వెరు
వాస్తవమ్ము నార్లవారి మాట

సత్య మెల్ల వేదసంహితలో నున్న
నుపనిషత్తు లెందు కుద్భవించె ?
సత్యసీమపరిధి నిత్యవిస్తృతి గాంచు
వాస్తవమ్ము నార్లవారి మాట

వేదమందు గొప్ప విషయ మే మన్నచో
మనకు తెలియదనును మంత్రమహిమ :
వేదవేత్తతోడ వాదింప బని లేదు !
వాస్తవమ్ము నార్లవారి మాట

పెద్దబాలశిక్ష హద్దుతో నిలిచిన
విద్దె యెంత ? దాని విలువ యెంత ?
వేదపాఠి కుండు విజ్ఞాన మెంతరా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

సంశయమ్ము లేక, సంశోధనము లేక
విరివి గాంచ వెట్టి విద్యలైన :
ఉన్న వెన్నొ ప్రశ్న లుపనిషత్తులలోన
వాస్తవమ్ము నార్ల వారి మాట

ప్రశ్ననుండి పుట్టు పరిణతజ్ఞానమ్ము ;
ప్రశ్నతోడ పెరుగు ప్రాభవమ్ము ;
ప్రశ్నలేక ప్రగతి ప్రశ్నార్థకమ్మురా !
వాస్తవమ్ము నార్ల వారి మాట

"ఏల, ఎప్పు, డెవ్వ" రిత్యాది ప్రశ్నలే
పశువునుండి వేఱుపఱచె నరుని :
ప్రశ్నతోనె నరుడు పరిణామమందెను
వాస్తవమ్ము నార్ల వారి మాట

వేయి ప్రశ్న లుండు విజ్ఞానవేత్తకు ;
ప్రశ్న లుండబోవు పామరునకు :
విజ్ఞుడౌను నరుడు జిజ్ఞాసచేతనే
వాస్తవమ్ము నార్లవారి మాట

వేదవాక్కునైన విజ్ఞాని మెచ్చడు
హేతురహితమైన రీతి నున్న :
గుడ్డి నమ్మకాలు గొడ్డుకే చెల్లురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

వేదయుగమునందు వైదికధర్మంబు ;
బుద్ధయుగమునందు బౌద్ధ మిట్లె :
యుగముబట్టి కాదె యుగధర్మ మెప్పుడు ?
వాస్తవమ్ము నార్లవారి మాట

వెన్నునందు లేవు కన్ను లన్నవి నీకు;
ముఖమునందు గలవు ముందు చూడ:
ముందుచూపు లేక ముందుగతులు లేవు
వాస్తవమ్ము నార్లవారి మాట

రాజు దోచె ప్రజను, పూజారి దోచెను
నిన్న, మొన్నదాక అన్ని చోట్ల:
నిలువు ధోపి డొకటె నిన్న మొన్నటి గొప్ప
వాస్తవమ్ము నార్లవారి మాట

కాలగతిని మార్పు కనలేని మానిసి
గాడి తప్పునట్టి గానుగెద్దు:
మార్పులేక జగతి నూరైన లేదోయి!
వాస్తవమ్ము నార్లవారి మాట

ప్రాతలోనె లేదు ప్రాశ_స్త్య మంతయు ;
క్రొ_త్త యెల్ల హాని కూర్చబోదు ;
క్రొ_త్త నీరురాని కోనేరు పస రెక్కు
వా_స్తవమ్ము నార్లవారి మాట

గతములోనె తప్ప ఘనత లే దనువాడు
ముందుచూపులేని ముండమోపి :
గతము జేరగలరె గతియింపకున్నచో ?
వా_స్తవమ్ము నార్లవారి మాట

క్రొ_త్త యించుకంత మ_త్తిల జేసియు
పాత నీరసమ్ము పాఱద్రోలు :
మత్తు జల్లనట్టి మధుమాస ముండునా ?
వా_స్తవమ్ము నార్లవారి మాట

పాత చింతకాయపచ్చడి సాటిగా
పాత ఘనత మంచి "పథ్య" మౌను :
"పథ్య" ముడుగు జాతి పరిపుష్టి యేపాటి ?
వాస్తవమ్ము నార్లవారి మాట

పూర్వవైభవమ్ము పూర్వికులకు కీర్తి
మకుట మనుట నిక్కమౌను గాని,
మౌళి దాల్ప మనకు మణికిరీటము కాదు
వాస్తవమ్ము నార్లవారి మాట

క్రొత్త నీటివెంట చెత్త చెదారము
కొద్ది గొప్ప కొట్టుకొనుచు వచ్చు :
చెత్తనీ రటంచు చెఱువున బెట్టమా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

గత విభూతితోడ, మృతభాషతోడను
జాతి ముందు కెట్లు సాగగలదు ?
దారి చూపగలదె ఆరిపోయిన దివ్వె ?
వాస్తవమ్ము నార్లవారి మాట

పనికిమాలినట్టి పాతశాస్త్రము లెల్ల
ఎంత చదువుకొన్న నేమి ఫలము ?
ఊక దంచుకొన్న నూకలు దొరకునా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

తగదు, తగదు నీకు తలక్రింద బ్రతుకన్న
ఆగ్రహింపకున్నె అలా కబోది ?
కలువవచ్చు నిల్లై పలోవు ఛాందసుడైన
వాస్తవమ్ము నార్లవారి మాట

అన్యజనుల నెవరి నంటక, ముట్టక
తొలగి తొలగి విడిగ మెలగుచుండ,
అవల ద్రోసి మిమ్ము అవని ముందుకు సాగు
వాస్తవమ్ము నార్లవారి మాట

ఇరుగు పొరుగునుండి యెరవు దెచ్చుకొనక
జరగ దెట్టి గొప్పజాతికైన :
ఎరవు పుచ్చుకొనుట పరువుతక్కువ కాదు
వాస్తవమ్ము నార్లవారి మాట

తలుపులు, కిటికీలు నలువైపులను లేక
బయటి వెలుగు పడదు బ్రతుకుపైని :
గోడ లున్న చాలు గోరీలకైనచో
వాస్తవమ్ము నార్లవారి మాట

గుడ్లగూబ పెద్ద గుడ్లున్నదైనను
సుంతయైన వెలుగు జూడలేదు :
విద్య లున్ననేమి విజ్ఞత లేకున్న ?
వాస్తవమ్ము నార్లవారి మాట

చర్చ లెందు కోయి చవిటి బుఱ్ఱలతోడ ?
వాద మేల వెఱ్ఱివారితోడ ?
తర్క మెందు కోయి మర్కటమ్ములతోడ ?
వాస్తవమ్ము నార్లవారి మాట

గొప్ప సత్యమైన గుడ్డిగా నమ్మిన
చెడుగు జేయు, నీకు చేటు దెచ్చు .
అవకతవక వయము ఆలోచనున్నచో ?
వాస్తవమ్ము నార్లవారి మాట

క్రొత్త సత్య మనెడి ముత్తియ మేర్పడ
హేతువాద మొకటె స్వాతివాన :
ధాతకైన వలయు హేతువాదబలము
వాస్తవమ్ము నార్లవారి మాట

హేతువాదవహ్ని హిమమురీతి కరగి
నాశమందు మూఢ నమ్మకమ్ము :
నిత్యసత్య మేమొ నిగ్గుదేలు మరింత
వాస్తవమ్ము నార్లవారి మాట

హేతువాద మన్న సేతువు లేకున్న
నరుడు దాటనేర్వ డిరులవాగు :
భీతి గొలుపు బ్రతుకు హేతుబద్ధముగాక
వాస్తవమ్ము నార్లవారి మాట

భూతజాలమందు హేతువాద వరము
నరు డొకండె వడసె నలువనుండి :
రోత కాదె బ్రతుకు హేతువాదము వీడ ?
వాస్తవమ్ము నార్లవారి మాట

ఎల్ల లేవొ తనకు హేతువాదమె తెల్పు ;
వల్లగాని పనికి వెళ్లబోదు ;
ప్రల్లదనము లేక ప్రగతి మార్గము జూపు
వాస్తవమ్ము నార్లవారి మాట

హేతువాద మన్న హేళనచేయుట
కోతి ననుచు చాటుకొనుట కాదె ?
హేతు వేమి వలయు కోతి చేష్టల జేయ ?
వాస్తవమ్ము నార్లవారి మాట

హేతువాద మన్న జ్యోతిని చేబూని
అమరలోకపథము నరయు నరుడు :
లేదు ప్రగతి హేతువాదప్రభుత లేక
వాస్తవమ్ము నార్లవారి మాట

హేతువాదియే వినీతవర్తను డౌను ;
హేతువాదియే పునీతు డౌను ;
హేతువాదియే విజేతగా ధర నెల్లు
వాస్తవమ్ము నార్లవారి మాట

అణుయుగమ్మునందు అడుగుపెట్టి నరుడు
ఆతియుగమునాటి రీతి విడడు :
నడత మాఱకున్న నరు డెట్లు మాఱురా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

నరుడు నరుడుకాక కరుణామయుడు కాడు ;
నరుడు నరుడుకాక సురుడు కాడు ;
నరుడు నరుడుకాక చరితార్థుడును గాడు
వాస్తవమ్ము నార్లవారి మాట

నాకు వలయు ముక్తి, నాకు మోక్ష మనుట
పట్టిచూడ వట్టి స్వార్థబుద్ధి :
నరుడు కోరవలెను నరజాతి ముక్తిని
వాస్తవమ్ము నార్లవారి మాట

దేవతలము గాము దేవత్వమును గోర ;
మానవతయె శోభ మానవులకు :
మానవత సుమింప మరి యేల స్వర్గము ?
వాస్తవమ్ము నార్లవారి మాట

తనకు లేని దేదొ, తా గోరు నేదేదొ
అట్టిదాని కెల్ల పెట్టె నరుడు
అమరలోక మనుచు నందాల పేరొందు !
వాస్తవమ్మ నార్లవారి మాట

దేవురింపనేల దేవేంద్రలోకము ?
త్రాగి త్రేన్చినావె ధాత్రి సుధను ?
రంభ లిచట లేరె రంజింపనేర్చిన ?
వాస్తవమ్మ నార్లవారి మాట

ఆక లెఱుగరంట నాకలోకమువారు ;
ఆక లెఱుగనట్టి లోక మేల ?
ఆస్థ లన్ని పుట్టు నాకలినుండియే ?
వాస్తవమ్మ నార్లవారి మాట

అమరలోకవాసు లనిమిషులైనచో
కలల నెట్లు వారు కాంచగలరు ?
కలలులేని బ్రతుకు వెలవెలబోవదా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

నిజముగా దివిజులు నిత్యయౌవనులైన
పరిణతంపుబుద్ధి బడయగలరె ?
ఫలము రుచ్యమౌనె పరిపక్వ మందక ?
వాస్తవమ్ము నార్లవారి మాట

మరణ మెఱుగరంట సురలోకవాసులు ;
అంతులేని బ్రతుకు లెంత రోత ?
తెంపులేని విందు లింపు కానోపునా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

దివి యనంగ నరుని తియ్యని కల లెల్ల
చుక్కలందు కట్టు సొగసు నగరు :
కలలు నిజములైన కల దిందె దివికూడ
వాస్తవమ్మ నార్లవారి మాట

భక్తి చూపబోవు పరదేశములపట్ల
శ్రీలు పొంగుచున్న సీమ లనుచు :
భక్తి మ్రొక్కదగునె పరలోకముల కీవు
వాస్తవమ్మ నార్లవారి మాట

జగతి మిథ్యయైన జపతపమ్ములు మిథ్య :
జగతి మిథ్యయైన జన్మ మిథ్య :
జగతి మిథ్యయైన జగదీశుడే మిథ్య
వాస్తవమ్మ నార్లవారి మాట

స్వర్గమార్గమందు సత్రమ్ము పగిదిగా
ధాత్రి నెంచుకొనుట ధర్మ మగునె ?
కన్నతల్లి ధాత్రి, కామధేనువు ధాత్రి
వాస్తవమ్ము నార్లవారి మాట

అన్యజాతికి మన మమ్ముడై పోవుట
ద్రోహమైన, ఎంత దూష్యమౌను
అన్యజగతికి మన మమ్ముడై పోవుట !
వాస్తవమ్ము నార్లవారి మాట

నిజమె-మృత్యు వుండు "పి" వన్నదానికి,
"మనము" మాత్ర మెపుడు మహిని నిలుచు :
నరు డవిత్యుడయ్యు నరజాతి నిత్యము
వాస్తవమ్ము నార్లవారి మాట

వెఱ్ఱిమాట కాదె వెళ్ళిపోయెడు వేళ
రారు వెంట సొంతవార లనుట ?
వెంట రమ్మటంచు వెడగైన కోరుట ;
వాస్తవమ్ము నార్లవారి మాట

తను వనిత్యమైన, తథ్యమైనను చావు
వరము కాదె తిరిగి తిరిగి జన్మ ?
ఎపటి కపుడె క్రొత్త యీ ధాత్రి శోభలు !
వాస్తవమ్ము నార్లవారి మాట

నరుని వృద్ధికంటె చరమలక్ష్యము లేదు ;
నరుని జగతి విడిచి పరము లేదు ;
నరుడు లేనిచోట నారాయణుడె లేడు
వాస్తవమ్ము నార్లవారి మాట

మున్ను గలరు మనకు ముక్కోటి దేవుళ్లు ;
మున్ను ప్రజలుకూడ మూడు కోట్లు ;
ముప్పదేడు కోటు లిప్పటి దేవుళ్ల
వాస్తవమ్ము నార్లవారి మాట

నరుని భక్తినుండి హరి యుద్భవించెను ;
భయమునుండి పుట్టె భైరవుండు :
నరునిలోనె కలరు హరిహరు లిద్దఱు
వాస్తవమ్ము నార్లవారి మాట

మతములనుచు పుట్టి మన్వంతరము లాయె ;
మనుజునందు మిగిలె దనుజవృత్తి :
మతము లెప్పు డింక మనుజుని పెంచురా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

మతము జరిపినట్టి మారణహోమాలు
చరిత నెంత కలుషపఱచలేదు ?
నరుని జంపి మతము పరమేశు గాపాడు
వాస్తవమ్ము నార్ల వారి మాట

మతము త్వరితగతిని మతముగా మాఱును ;
మతము కుళ్లిపోవు మతమునందు ;
మతముపేర మతము మత్తుమందుల నమ్ము
వాస్తవమ్ము నార్లవారి మాట

క్రీస్తుమార్గ మొండు, క్రైస్తవమత మొండు ;
బుద్ధదేవు డొండు, బౌద్ధ మొండు :
ఆదిమతము శూన్య మాచార్యపీఠాన
వాస్తవమ్ము నార్లవారి మాట

మతము లెన్నియైన మానవత్వ మొకటె ;
జాతు లెన్నియైన జగతి యొకటె ;
పథము లెన్నియైన పరమార్థ మొక్కటే
వాస్తవమ్ము నార్లవారి మాట

గుడులు నూరు ఒక్క గుటకగంజికి సాటి ;
గుడులు వేయి ఒక్క బడికి సాటి ;
గుడులు లక్ష ఒక్క గుండెకాయకు సాటి
వాస్తవమ్ము నార్లవారి మాట

ఎన్ని పేర్లతోడ నే యే మతము లున్న
మానవతను మించు మతము లేదు ;
మానవత ఫలింప మాధవుండె తరించు
వాస్తవమ్ము నార్లవారి మాట

పాతజన్మలోని పాపమ్ము వల్లనే
లేమి వచ్చు ననుట లేకి మాట:
లేకి సంఘమందె లేమి కారణ ముందు
వాస్తవమ్ము నార్లవారి మాట

కలిమి లేనిచోట కళ లెట్లు వర్ధిల్లు?
కలిమి కలిగినపుడె కళలవృద్ధి;
వెలితినుండి పుట్టు విప్లవ మొక్కటే!
వాస్తవమ్ము నార్లవారి మాట

కాటకమ్మె అల్లకల్లోలముల కెల్ల
సాటిలేని మంత్రసాని సుమ్ము:
ఆకలి చెలరేగ లోకాలె భస్మమౌ!
వాస్తవమ్ము నార్లవారి మాట

కూడుగుడ్డ లేక గోడుగో డనువారు
వాడవాడల నడయాడుచుండ
ఆడబోదు శాంతి నీడైన జగతిపై !
వాస్తవమ్ము నార్లవారి మాట

కూడుకూర కెట్టి కొఱతయు లేకున్న
పాడుబుద్ధు లింత ప్రబలబోవు ;
కూడుగల్గు కుక్క కుండలు నాకునా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

డబ్బులేని బ్రతుకు మబ్బు పట్టిన రాత్రి ;
డబ్బుతోడ వచ్చు నిబ్బరమ్ము ;
డబ్బు లేనివాడు డుబ్బుకు కొఱగాడు
వాస్తవమ్ము నార్లవారి మాట.

డబ్బు చేరినంత డప్పులు మ్రోగును ;
డబ్బు దాచలేని గబ్బు లేదు ;
డబ్బుగల్గు మేక బెబ్బులిగా జెల్లు
వాస్తవమ్ము నార్లవారి మాట

రామి డబ్బు చేర రామామణిగ మారు ;
వేష మెల్ల మారు ; భాష మారు :
మారనట్టి దొక్క మలినంపు బుద్ధియే
వాస్తవమ్ము నార్లవారి మాట

కాసులున్నవాడు కల్లలాడిన జెల్లు ;
కాసులున్నవాడు వాసి కెక్కు ;
కాసులున్నవాడు గాడిద గుఱ్ఱమౌ
వాస్తవమ్ము నార్లవారి మాట

అప్పు నడిగి చూడు మన్నదమ్ములనైన
నీకు తెలియదేని రూక విలువ :
రూక నీడలోనె లోకమెల్ల నిలుచు
వాస్తవమ్ము నార్లవారి మాట

నెత్తి నెక్కి త్రొక్కి విత్తమ్ము చేతిలో
పెత్తనమ్ము నీవు పెట్టెదేని :
విత్త మొత్తు కాళ్ల తొత్తుగా నిల్పిన
వాస్తవమ్ము నార్లవారి మాట

కూడివచ్చెనేని కోటానుకోట్లను
మూట గట్టవచ్చు మూర్ఖులైన :
విజ్ఞు డొకడె సరిగ వెచ్చింపనేర్చురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

విస్మరింపవచ్చు పితృవియోగమ్మును
శ్రాద్ధకర్మ సగము జరుగుసరికె :
విస్మరింప లేరు పిత్రార్జితము పోవ
వాస్తవమ్ము నార్లవారి మాట

మేడ లున్నవాడె కా డోయి మొనగాడు ;
కొంప లేనివాడు టొంప కాడు :
కోయిలమ్మ కింత గూడైన లేదోయి !
వాస్తవమ్ము నార్లవారి మాట

మేడ యెత్తు జూచి, వాడ సొబగు జూచి,
కారు పొడవు జూచి, కలిమి జూచి
వెలితి నెఱుగ డంచు పలుకంగ వచ్చునా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

దయ దలంప నేల, దాతృత్వ మేలరా
లేమి లేశమైన లేనిచోట ?
దాత లున్నచోట దారిద్ర్య ముండురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

ఇచ్చువాని కెపుడు బుచ్చుకొనెడివాడు
తగ్గి మెలగుచుంట తప్పదయ్య :
ఇచ్చువాని చేయి ఎల్లెడ పైనుండు
వాస్తవమ్ము నార్లవారి మాట

పేదయగునె తనకు లేదని పొగలక ?
పేదయగునె గుండె పేదకాక ?
పేదయగునె బ్రతుకు చేదు విషముకాక ?
వాస్తవమ్ము నార్లవారి మాట

వాస్తవమ్ము.

అంతుమాలినంత ఐశ్వర్యవంతుని
చెంత కెంతమంది చేరబోరు ?
పొంతకుండ నీళ్లు కొంతైన కాగవా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

సగటు చదువుపిదప, సగటు కొలువునందు,
సగటు సుఖముతోడ సాగునట్టి
సగటు బ్రతుకుకంటె వెగటైన దే దోయి ?
వాస్తవమ్ము నార్లవారి మాట

దొడ్డవాడు సుమ్ము దూరపుబంధువు ;
ఎంత దూరమైన నంత దొడ్డ ;
అడ్డుగోడ లున్న నంతకంటెను దొడ్డ
వాస్తవమ్ము నార్లవారి మాట

ఏడ్పుగొట్టు నక్క, లేబ్రాసి కుక్కలు,
పులులు, ముండ్లపంది, ఎలుగుబంట్లు
మనుజరూపమందు మహి నెన్ని లేవోయి!
వాస్తవమ్ము నార్లవారి మాట

ఎగ్గు దలపకున్న, సిగ్గు విడువకున్న,
నెగ్గు వైపు చూచి మొగ్గకున్న
అగ్గలింపనేర డవకాశవాదిగా
వాస్తవమ్ము నార్లవారి మాట

మదురుగోడపైన కుదురుగా గూర్చుండి
గెల్చుచున్నవైపు గెంతువాడు
తల్లి గొంతునైన తడిగుడ్డ గోయురా!
వాస్తవమ్ము నార్లవారి మాట

కామరూపసిద్ధి కలదోయి నరునకు :
పశు వతండె, ధర్మవశు డతండె ;
దైవసము డతండె, దైత్యనాథు డతండె
వాస్తవమ్ము నార్లవారి మాట

ఎడదకంటె కలవె యెత్తైన కొండలు ?
ఎడదకంటె లోతు కడలి కలదె ?
ఎడద కెడదె సాటి యెత్తు లోతులలోన
వాస్తవమ్ము నార్లవారి మాట

ఎడదకంటె వింత మడుగు లెందు కలవు ?
ఎడదకంటె పొంగు నేఱు లేవి ?
ఎడద కెడదె సాటి యింకినా, పొంగినా
వాస్తవమ్ము నార్లవారి మాట

ఎడదనుండు నోయి కడవల కన్నీళ్లు ;
ఎడదలోనె నిప్పుటేఱు లుండు :
అడలనేర్చు నెడద, అడలింప నేర్చును
వాస్తవమ్ము నార్లవారి మాట

ఎడదనుండు నోయి గుడిగోపురమ్ములు ;
ఎడదలోనె సానిగుడిసె లుండు :
ఎడద వెలుగు లుండు; కడిమి చీకటు లుండు
వాస్తవమ్ము నార్లవారి మాట

ఎడద పెరుగుచుండు నేపైన నారుగా ;
ఎడద సాగుచుండు నేరువాక ;
ఎడద పండుచుండు నెన్నెన్నొ పంటలు
వాస్తవమ్ము నార్లవారి మాట

లక్ష్యసిద్ధిలో విలంబనమ్ము జరుగ
చింత లేల ? మదిని వంత లేల ?
అందనున్న ఫలమె అత్యంత మధురమ్ము
వాస్తవమ్ము నార్లవారి మాట

కలల గాంచకున్న కల్ల సుమ్ము ప్రగతి ;
నేటి కలలె రేపు నిజము లౌను :
నేటి అణుయుగమ్ము నిన్నటి కల గాదె ?
వాస్తవమ్ము నార్లవారి మాట

మనసులో నిగూఢమైయుండు వాంఛలు
కలసి విసురు వలలె కల లనంగ :
వలల బట్టువడవె వెలలేని ముత్యాలు ?
వాస్తవమ్ము నార్లవారి మాట

కలకు రెక్క లుండు గాలాంబుధిని దాట ;
కలకు విశ్వకవుల కన్ను లుండు ;
కలకు గుండె లుండు నిల నెల్ల గదలింప
వాస్తవమ్ము నార్లవారి మాట

నిద్ర జెందు స్మృతిసముద్రగర్భములోన
కాంక్ష లేపు నలలె కల లనంగ :
అలలు చేరబోవె ఆశాంతములనైన ?
వాస్తవమ్ము నార్లవారి మాట

కలలనుండి పుట్టు కవితాస్రవంతులు ;
కలలులేక లలితకళలు లేవు ;
కలలులేక విశ్వకల్యాణమే లేదు
వాస్తవమ్ము నార్లవారి మాట

పసిడికలలతోడ పడుగు చక్కగ జేసి,
నిజము పేకకాగ నేత నేసి
బ్రతుకు దిద్దకున్న భవితవ్య మెట్లుండు ?
వాస్తవమ్మ నార్లవారి మాట

చిన్నతనమునందు కన్నట్టి కలలెల్ల
పండెనేని వయసు నిండుసరికి
గొప్పబ్రతు కటంచు జెప్పంగవచ్చురా !
వాస్తవమ్మ నార్లవారి మాట

ఏకలక్ష్య మున్న నెదుగు బొదుగు నుండు ;
రేగు కోర్కె యున్న లేదు వృద్ధి ;
ఊపిరాడనీయ వుత్తుత్త కోర్కెలు
వాస్తవమ్మ నార్లవారి మాట

నిక్కి చూచు గొన్ని, నక్కియుండును గొన్ని
లెక్కపెట్టగలమె చుక్క లెన్నొ ?
లెక్కపెట్టలేము రిక్తవాంఛలనైన
వాస్తవమ్ము నార్లవారి మాట

తెంపు లేనివాడు కంపబడిన కాకి ;
తెంపు సేయకున్న పెంపు లేదు :
ఈద వెఱచు పిరికి యిద్దరినే యుండు
వాస్తవమ్ము నార్లవారి మాట

చచ్చు నొక్కసారె సాహసోపేతుడు ;
పిరికిపంద చచ్చు పెక్కుసార్లు :
రోజు రోజు చావు రోత పుట్టింపదా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

మేరు పెక్కుబోయి జారిపడుట మేలు
కించపడుటకంటె క్రింద నిలిచి :
సాహసమ్ము లేక సాఫల్య ముండునా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

ముప్పుకొప్పులోనె ముడివడియుండును
మెప్పునందగల్గు గొప్ప పూలు :
విప్పుకొన్నవాడె విభవమ్ము నందురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

మిణుగు రెంత ? దాని మేనిదీప మదెంత ?
తెగువజేసి తిరుగు తిమిరజలధి :
సాధ్య మేది కాదు సాహస మున్నచో ?
వాస్తవమ్ము నార్లవారి మాట

ఆత్మగౌరవమ్మె అడుగంటిపోయిన
బ్రతికి యొకటె, ఉసురు బాసి యొకటె :
ఊడెనేని పువ్వు, కాడ కేమి విలువ ?
వాస్తవమ్ము నార్లవారి మాట

ఉక్కుమనిషి యెవడొ, ఊకమూట యెవడొ
కష్టకాలమందె స్పష్టపడును :
ఉత్తవేళలందు ఉత్తము లందఱు
వాస్తవమ్ము నార్లవారి మాట

పరిసరమ్ము లెంత ప్రతికూలమైనను
వేరుదన్ను జేవ మీఱువాడు :
మదురుగోడ చీల్చి మఱ్ఱులు పెరుగవా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

లోక మెల్ల కినిసి, ఏకమైననుగాని
ధీరుడైనవాడు మాఱబోడు :
ధిక్కరింపనోపు ధీరు డీశ్వరుడైన
వాస్తవమ్ము నార్లవారి మాట

లోభివానికంటె లొట్టిపిట్ట నయము ;
కోపదారికంటె కోతి నయము ;
పిఱికిపందకంటె పీనుగే నయమురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

భయము తొంగిచూడ పరువెత్తు మగసిరి ;
భయమువెంట భూతచయము వచ్చు ;
భయము నిలుచుచోట జయలక్ష్మి నిలువదు
వాస్తవమ్ము నార్లవారి మాట

భయముకంటె వేఱె భయపెట్టునది లేదు ;
భయములోనె సకల బాధ లుండు ;
భయమువలన నరుడు దయమాలి వర్తించు
వాస్తవమ్ము నార్లవారి మాట

దీప్తి నివ్వగల్గు ధీశక్తి గల్గియు
చిక్కువడెను నరుడు చీకటింట :
ధీరగుణము లేని ధీశక్తి యేలరా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

ప్రగతికాంక్ష నెల్ల భయముతో భాగించి,
ఈర్ష్య పెట్టి ఆశ హెచ్చువేసి,
వెరసిచేయ నేటి నరుని జీవితమౌను
వాస్తవమ్ము నార్లవారి మాట

జాతిగొడ్డ లిపుడు చేతబట్టడు గాని
భీతి మిగిలె నరుని చేతలందు ;
ఆత డిపుడు చేత నణ్వస్త్రముల బట్టు
వాస్తవమ్ము నార్ల వారి మాట

చచ్చిపోవ నొక్క క్షణమైన పట్టదు ;
కష్టమెల్ల బ్రతుకు గడపుటందె :
భీరుడయ్యు చచ్చు ; ధీరుడే బ్రతుకురా !
వాస్తవమ్ము నార్ల వారి మాట

చేతగానివాడు సృష్టికర్తను తిట్టు
వ్రాలు నొసట తప్పు వ్రాసెననుచు :
వ్రాలు తప్పు కాదు, వాజమ్మ తప్పురా !
వాస్తవమ్ము నార్ల వారి మాట

చావుపేరు చెప్ప సంచలించెద వేల ?
నిద్రపోవె నీవు నిత్యవిధిగ ?
నిద్ర తెలియకున్న నీ కేమి బాధరా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

నిలిచి నీళ్లు త్రాగ నీళ్లు కాలు బ్రతుకు ;
పరుగులెత్త వోయి పాలు త్రాగ ;
పరుగునుండి పుట్టె నరుని నాగరికత
వాస్తవమ్ము నార్లవారి మాట

మృత్యుసేనతోడ నిత్యమ్ము పోరాడి
గెలుచుకొన్నవఱకె నిలుచు బ్రతుకు :
పోరి గెల్వబట్టె ఊరించు బ్రతు కెంతో
వాస్తవమ్ము నార్లవారి మాట

అప్పుడపుడు కొన్ని అమరక్షణములందు
జలధరంబు జూడ, జలధి జూడ
బ్రతికియుంటకంటె భాగ్యమేమని తోచు
వాస్తవమ్మ నార్లవారి మాట

ముసలి రావిచెట్టు ముద్దుగా తొడిగెను
కొమ్మకొమ్మ కొక్క క్రొత్త రైక :
ముసలిదయ్యు చెట్టు ముద్దులు గులుకురా !
వాస్తవమ్మ నార్లవారి మాట

రవ్వ పుట్టు తాయి తాయి రాచుకొనగ ;
మెఱపు పుట్టు మబ్బు లొరసికొనగ ;
కూర్మి పుట్టు గుండె గుండె హత్తుకొనగ
వాస్తవమ్మ నార్లవారి మాట

సత్ర మొక్క దివ్యసౌధమ్మె యైనను
ఇంత గుడిసె మేలు సొంతమైన :
"సొంత"మన్న మాటె సంతోషపఱచురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

"అహము" కొంత వలయు నిహముపై జీవింప ;
"అహము"లోనె జీవమహిమ కలదు ;
"అహము" పెరుగు టొకటె అధమాధమం బౌను
వాస్తవమ్ము నార్లవారి మాట

"అహము" లేనివాడు మహిలోనె లే డోయి ;
"అహము" దాచు నొకడు యశము గోరి ;
"అహము" జూప దొక్క డవకాశములు లేక
వాస్తవమ్ము నార్లవారి మాట

అవగుణంబులైన నలరించు నొకనిలో ;
గణన కెక్కఁ డొకడు గుణము గల్గి ;
గుణగణాల విలువ గుణియింప లే మోయి !
వాస్తవమ్ము నార్లవారి మాట

రాము డెంతవాడొ, రావణాసురు డంత :
శిష్టు డొకడు, పరమ దుష్టు డొకడు ;
తొణకుచుండు ఘనత దుష్టత్వమందైన
వాస్తవమ్ము నార్లవారి మాట

ఒప్పులోనె కాక, తప్పులోనైనను
గొప్పతనపు ముద్ర కప్పువడదు :
గొప్పవాని తప్పు గొప్పదై యుండును
వాస్తవమ్ము నార్లవారి మాట

సభల కేగి, అందు సమ్మానముల నంది
వార్త కెక్కినంత కీర్తి రాదు :
వార్త బ్రతుకు క్రొత్త వార్త పుట్టువఱకె
వాస్తవమ్ము నార్లవారి మాట

వెంటబడినవాని కంటగించుకొనుచు
గెంటి వేయునట్టి కీర్తికాంత
జంట గోరి వచ్చు జయశీలి చెంతకు
వాస్తవమ్ము నార్లవారి మాట

పూలదండ మెడను వ్రేలాడినంతనే
కౌగిలింప కీర్తికాంత రాదు :
పూలదండకీర్తి పూలతో వాడురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

ప్రజ్ఞ యుండెనేని ప్రకటము గాకుండ
దాచుకొన్నగాని దాగబోదు :
గుబులుకొనక తావి గుప్తమై యుండునా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

పెరిగి, పెద్ద కాగ, వేదిక లేదంచు
చింత జెందబోడు శిష్టు డెవడు :
విగ్రహమ్మె సుమ్ము వేదిక గోరును
వాస్తవమ్ము నార్లవారి మాట

పట్టి శుంఠ కెట్లొ వచ్చిన విఖ్యాతి
అట్టె వెలిగి, ఇట్టె ఆరిపోవు :
గోగుపుల్లమంట భోగ మెందాకరా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

ప్రతిభ జూపువాని ప్రాజ్ఞలోకము మెచ్చు,
జయము గన్నవాని జనత మెచ్చు :
జయములేని ప్రతిభ జనత కర్థము కాదు
వాస్తవమ్ము నార్లవారి మాట

పరమశాంతమైన పరతత్త్వవేత్తగా
పూజ లందు మౌనముద్ర దాల్చి :
మౌనముద్రలోని మాహాత్మ్య మంతరా !
వాస్తవమ్ము నార్లవారి మాట

ప్రతిభ కూర్పులేని ప్రఖ్యాతి సిద్ధించు
నటనలో నశేష పటిమవల్ల :
ప్రతిభ పరిమళించు భావితరములందె
వాస్తవమ్ము నార్లవారి మాట

శక్తియుక్తి లేని సామాన్యుడైనను
అల్పజనులమధ్య నతిశయించు :
గులకరాళ్లమధ్య గుండ్రాయి గొప్పరా !
వాస్తవమ్మ నార్లవారి మాట

దృష్టి వక్రమైన భ్రష్టుడౌను నరుడు ;
దృష్టి నిశితమైన ద్రష్ట యగును ;
దృష్టి నష్టమైన సృష్టియే నష్టమౌ
వాస్తవమ్మ నార్లవారి మాట

ఆశలేని ప్రాణి అణగారిపోవును ;
ఆశ జంపుకొనుట ఆత్మహత్య ;
ఆశ వలయు; కూడ దత్యాశ మాత్రమే
వాస్తవమ్మ నార్లవారి మాట

ఆశలేని మనుజు డవనిపై నుండడు ;
కాదె ఆశ మోక్షకాంక్ష గూడ ?
ఆశ దోషమౌట అల్పవిషయమందె
వాస్తవమ్ము నార్లవారి మాట

ఆస కూడదనుట అర్థరహిత మోయి ;
ఆస లేనిచో ప్రయాసపడరు ;
ఆస లేని ధాత్రి వాసయోగ్యము కాదు
వాస్తవమ్ము నార్లవారి మాట

ఆస చేయుచుండు మోస మప్పుడపుడు ;
అందినట్లు తోచి అందకుండు :
ఆసలోని గొప్ప ఆకర్షణం బిది
వాస్తవమ్ము నార్లవారి మాట

ముసలితనమునందు మసక వచ్చుననుట
అర్ధసత్య మోయి అరసి చూడ :
ఎదకు వచ్చు మసక ఎల్లప్రాయమందైన
వాస్తవమ్ము నార్లవారి మాట

స్వార్థచింత మెందు శైశవావస్థలో ;
మెండు, తిరిగి, వయసు పండినపుడు :
నిండు జవ్వనాన నిస్స్వార్థ ముండురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

స్వార్థపరత దాల్చు ఛద్మవేషంబులు ;
స్వార్థపరత చేయు శాస్త్రచర్చ ;
స్వార్థపరత లోకసంగ్రహమ్ముగ జెల్లు
వాస్తవమ్ము నార్లవారి మాట

కొంచెమైన పరుల కుపయోగపడలేని
మంచితనపు మాట నెంచనేల ?
కంచెలోని తేనె కుంచాల లెక్కేల ?
వాస్తవమ్ము నార్లవారి మాట

మనకు తెలియకుండ మననైజ మితరులు
బాధ పెట్టవచ్చు బహుళగతుల :
కంద దురద యెంతొ కందకు తెలియునా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

కష్టకాలమందు కఱవుకాగల మైత్రి
ఎంత గొప్పదైన నేమి ఫలము ?
సమయమందు లేని సంజీవి యేలరా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

క్షణము కొక్కరీతి సంచరించెడువాని
నమ్మకొన్న బ్రతుకు వమ్ము కాదె?
ఎక్కదగునె పడవ చుక్కాని లేకున్న?
వాస్తవమ్ము నార్లవారి మాట

చెఱుపు చేయగల్గు చుఱుకుదనము గల్గి
చేయనట్టివాడె శిష్టు డౌను:
చేతకానితనము శిష్టత కాదోయి!
వాస్తవమ్ము నార్లవారి మాట

బద్ధకమ్ముతోడ, బుద్ధిమాంద్యముతోడ
మొద్దె యగును గాని, పెద్ద కాడు:
పెద్దమనిషి పేరు ఉద్దండునకె చెల్లు
వాస్తవమ్ము నార్లవారి మాట

అల్పజనులపట్ల నాగ్రహమ్మునన్నైన
తలచు వారి పేరె తలతువేని,
అంటవచ్చు నీకె అల్పబుద్ధులు కొన్ని
వాస్తవమ్ము నార్లవారి మాట

స్పర్ధవలన తొలగు సదసద్వివేకము ;
స్పర్ధవలన పెరుగు శత్రుగణము ;
స్పర్ధవలన బ్రతుకు వ్యర్థమైపోవురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

మాటలోన మైదు, మనసులోన విషము,
కడుపులోన చేదు, కంట నిప్పు :
చేత లెట్టివౌనొ చెప్పంగనేలయా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

ఇచ్చకమ్ము లాడవచ్చిన ముచ్చను
వచ్చినంత తరిమిపుచ్చవలెను :
మచ్చుమందు లుండు నిచ్చకమ్ములలోన
వాస్తవమ్ము నార్లవారి మాట

ఎదుటలేనివారి నేకధాటిగ తిట్టి
నీదు మెప్పు గోరు నీచనరుడు
పరులయెదుట నిన్ను పడదిట్టకుండునా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

కల్లబొల్లులాడు కపటిని నమ్మిన
ఇల్లు గుల్ల జేసి యేడిపించు :
చిల్లి పడవ నెక్క చిక్కున బెట్టదా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

కనులు తెఱచికొనియె కంపలో బడినచో
ముప్పు నందకుండ తప్పుకొనును :
కనులు మూసికొన్న కడగండ్లు తప్పవు
వాస్తవమ్ము నార్లవారి మాట

ప్రీతిలేని కొలువు జీతనాతము చేటు ;
శ్రద్ధలేని చదువు చమురు చేటు ;
కూర్మిలేని బ్రతుకు కూటికుండల చేటు
వాస్తవమ్ము నార్లవారి మాట

కాయకష్ట మెంతొ గౌరవప్రద మంచు
పలుకవచ్చు నీడపట్టునుండి :
గంత బరు వదెంతొ గాడ్దకే తెలియురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

నమ్మజాలవేని నిమ్మహి నెవ్వని
నిన్ను నమ్మలేవు నీవె తుదకు :
నమ్మి చెడుట మేలు నమ్మకుండుటకంటె
వాస్తవమ్ము నార్లవారి మాట

సులభమంద్రుగాని సలహాలు చెప్పుట
అంతకంటె సులభమౌను గాదె
చెప్పిన సలహాలు చెవి బెట్టకుండుట ?
వాస్తవమ్ము నార్లవారి మాట

నిక్కమైన దేదో, నక్కవినయ మేదో
లెక్కగొననివాడు చిక్కువడును :
ఉక్కుగోరు లుండు నక్కవినయమందు
వాస్తవమ్ము నార్లవారి మాట

లంచమనెడి గడ్డి రాల్చినవారికే
పనులు సేయువాడు పశువు సుమ్మ:
గడ్డి మేయువాడు గొడ్డు గాకుండునా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

చెడ్డదారి బట్టు చెనటి హితము గోరి
మంచిమాట చెప్ప మండిపడును :
చక్రపొంగలైన జ్వరపునోటికి చేదు
వాస్తవమ్ము నార్లవారి మాట

తడిసి మోపెడైన తర్వాతనేకాని
జూదగొండి పాలుజూచుకొనడు :
జూదగొండితనము జోగిని జేయురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

గాలి కెదురు నిలిచి గట్టిగా నుమిసిన
ఎగసివచ్చి పడును మొగముపైన :
తనకె హానిజేయు తనకోప మీ రీతి
వాస్తవమ్ము నార్లవారి మాట

కుళ్లు చూచినంత నొళ్లెల్ల కనులుగా
కెలుకవత్తురోయి తులువ లెపుడు :
కోళ్లగుంపు పేడకుప్పను కెలుకదా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

ముల్లు నొక్క గంట ముందుకు జరిపిన
గడవబోదు రాత్రి గంటముందె :
తొలగగలదె చిక్కు తొందరపడినంత ?
వాస్తవమ్ము నార్లవారి మాట

ఈగ యెంతొ చిన్న, ఏను గెంతయొ పెద్ద ;
బాధ సమము ; ప్రాణభయము సమము :
చిన్న పెద్ద లేదు చీకు చింతలలోన
వాస్తవమ్ము నార్లవారి మాట

ప్రబలుడయ్యు కూడ ప్రత్యక్షశత్రువు
చెఱుపు నంతుమీఱి చేయలేడు :
చాటునున్నవాడె చావుదెబ్బను తీయు
వాస్తవమ్ము నార్లవారి మాట

మఱపులేనినాడు వెఱపులు, చెఱుపులు
ఇఱుకునందు త్రోసి, కొఱికి తినును :
మఱపులేని మనసు మనపాల చెఱసాల
వాస్తవమ్ము నార్లవారి మాట

మఱపు లేని మనసు తెఱపిని పడబోదు ;
మఱపు లేక గుండె బరువు దిగదు ;
మఱపు లేని మనసు కఱకుకత్తులబోను !
వాస్తవమ్ము నార్ల వారి మాట

మఱపు దాల్చునట్టి మధురరూపమె నిద్ర ;
మఱపనంగ క్షమకు మాఱు పేరు ;
మఱపునుండి పుట్టు సరిక్రొత్త బ్రతుకులు
వాస్తవమ్ము నార్ల వారి మాట

మఱపు కొంతలేక మత్సరమ్ము పెరుగు ;
మఱపు కొంతలేక మనసు విఱుగు ;
కొంత కొంత మఱపు కొండంత వరమురా !
వాస్తవమ్ము నార్ల వారి మాట

కక్ష ప్రోత్సహించి కుక్షి నింపుకొనుట
పడుపువృత్తికంటె పాడు బ్రతుకు :
నక్కబ్రతుకు కంటె నరకమ్ము మేలోయి !
వాస్తవమ్ము నార్లవారి మాట

గుట్టు నివ్వరాదు గురుతుల్యునకు నైన ;
గుట్టులోనె కలదు దిట్టతనము :
గుట్టులేని బ్రతుకు నట్టేటి పడవరా !
వాస్తవమ్ము నార్లవారి మాట

తల్లితో డటంచు, దైవసాక్షి యనుచు
ఒట్టులేల మాట గట్టిదైన :
పెట్టనేల పోటి పట్టున్న గోడకు ?
వాస్తవమ్ము నార్లవారి మాట

ఇనుమునందె పుట్టి, ఇనుమునే తినివేయు
తుప్పువంటిదోయి తులువతనము :
తాను చెడును తులువ ; తనవారి జెడగొట్టు
వాస్తవమ్ము నార్లవారి మాట

తండ్రిమాట కడుగు దప్పని వాడైన
గౌతముండు ఘనత గాంచి యున్నె ?
స్వేచ్ఛ మెలగి యతడు సిద్ధార్థుడయ్యెరా !
వాస్తవమ్ము నార్లవారి మాట

కూళలందు జేరి కొడుకులు చెడిరంచు
వీధికెక్క నెంత వెఱ్ఱితనము ?
కడుపు కోసికొన్న కాళ్ళపై బడకున్నె ?
వాస్తవమ్ము నార్లవారి మాట

మాట మిగులుటొకటె ధాటి చూపుట కాదు ;
మాట పడినవాడు మఱచిపోడు :
మాట కఱకుదనము మనలనే నఱుకురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

పోరు తగదు దురుసు నోరున్నవానితో ;
పోరు కూడ దిరుగు పొరుగు తోడ ;
పోరు మొదలె తగదు పోలీసువానితో
వాస్తవమ్ము నార్లవారి మాట

దిట్టమైన దొంగ చట్టమ్ము దాటక
పట్టపగలె దార్లు కొట్టుచుండు :
పట్టువడని దొంగ పట్టాభిషిక్తుడౌ !
వాస్తవమ్ము నార్లవారి మాట

చెప్పినంత బోదు చేసిన పాపమ్ము;
సిగ్గు విడిచికూడ చెప్పవచ్చు;
చెప్పకున్నగాని చింతిల్లవలెనోయి!
వాస్తవమ్ము నార్లవారి మాట

కంట గురిసెనేని కన్నీరు ధారగా
మంట లెల్ల నణగి మణగి పోవు:
కాలిపోవు బ్రతుకు కన్నీరు కఱవైన
వాస్తవమ్ము నార్లవారి మాట

మరులు గొన్నవాడు మఱచును సభ్యత;
లజ్జ నుజ్జగించి రచ్చ కెక్కు:
చిత్తకార్తె కుక్క సిగ్గేల పడునోయి?
వాస్తవమ్ము నార్లవారి మాట

నారిలేని యింట, ఆరిపోయిన వంట,
గరువునేల పంట, గాజు కంట,
కసవు మంట నేమి పసయుండ నేర్చురా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

విధిని తిట్టు నొకడు విధుల బాలింపక ;
పరుల దిట్టు నొకడు పాటు వడక ;
ఏలలేక ఒక్కడాలినే తెగదిట్టు
వాస్తవమ్ము నార్లవారి మాట

కాయకష్టమసలె చేయనొల్లని జాతి
బ్రతుకవలెను బుద్ధిబలము తోడ :
చులుకుతనపు బుద్ధి చురకత్తి కానోపు
వాస్తవమ్ము నార్లవారి మాట

పరుల పంచ జేరి బ్రతుకు నీడ్చుటకంటె
కూలి నాలి చేసికొనుట మేలు :
కాయకష్టమనగ హేయ మేమియు కాదు
వాస్తవమ్ము నార్లవారి మాట

సంఘమందు పుట్టి, సంఘమందు పెరుగు
సంఘజీవి కాడె సభ్యనరుడు ?
సంఘవృద్ధిలేక స్వాభివృద్ధియు లేదు
వాస్తవమ్ము నార్లవారి మాట

కూడుపెట్టనేని కుమ్మరివిద్యయే
కడుపుమాడ్చు చదువుకంటె మేలు :
పస్తు పండబెట్టు పట్టమ్ము లేలరా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

చదివినంత జిత్తసంస్కార మబ్బదు ;
చదివి చదివి కూడ జడులు కారె ?
ఎదను పెంచినపుడె చదువు సార్థకమౌను
వాస్తవమ్ము నార్లవారి మాట

చెంబు చేతబట్ట సిగ్గిలకున్నచో
చదువవచ్చు పాత చదువు లెల్ల :
చెంబు నిండు టొకటె చిక్కురా యీనాడు !
వాస్తవమ్ము నార్లవారి మాట

కడు కురూపియైన గంటల కొలదిగా
అద్దమందు ముఖము దిద్దుకొనును :
అద్ద మెవరికైన నందమ్మె చూపురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

ఆడుదాని సిగ్గు ఆజన్మసిద్ధమ్ము ;
ఆడుదాని సిగ్గు ఆయుధమ్ము ;
ఆడుదాని సిగ్గు ఆభరణమ్మురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

నగలు లేవటంచు వగ జెందుటే గాని
నగలవల్ల లేని సొగసు రాదు :
మగువ కేల నగలు మనసిచ్చు మగ డున్న ?
వాస్తవమ్ము నార్లవారి మాట

తన్ను దానె వలచి, తాదాత్మ్య మొందుచు
కన్నె వలచు వన్నెకాని మొదట :
తన్ను దానె వలచు తర్వాత, తర్వాత
వాస్తవమ్ము నార్లవారి మాట

ప్రేమయందె కాక, విద్వేషమున గూడ
అతివ కతివె సాటి అవనిలోన :
ఆదిశక్తి నామ మతివకే చెల్లురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

కాంతలేని బ్రతుకు కాంతారవాసమ్ము ;
కాంతతోడి బ్రతుకు కఠిన శిక్ష :
ఉండి, లేక కూడ గండకత్తెర కాంత
వాస్తవమ్ము నార్లవారి మాట

కలత లుండుగాని గార్హస్థ్యమందున
శాంతి నాస్తి బ్రహ్మచర్యమందు :
శత సమస్య లుండు సన్యాసమందైన
వాస్తవమ్ము నార్లవారి మాట

అశ్రుధార లుండు నర్ధాంగి భర్తతో
తగవులాడి చేయు తర్కమందు :
అశ్రుధారపైన "అప్పీలు" మరి లేదు
వాస్తవమ్ము నార్లవారి మాట

తల్లి యోర్వలేదు తనయుని ప్రేమలో
కోడలైన కొంత కొసరెనేని :
అందువల్ల తగవు లత్తకోడండ్రకు
వాస్తవమ్ము నార్లవారి మాట

తల్లియొకతె సాకు తనయుల బదిమంది
నుంగలోన ప్రేమ రంగరించి :
తల్లియొకతె బరువు తనయు లెల్లరికినీ !
వాస్తవమ్ము నార్లవారి మాట

సూటి పోటి మాట, చుప్పనాతితనము,
మూతి ముక్కు విరుపు, సీతకన్ను :
అతుకు నెట్లు లింక అత్త కోడంద్రకు ?
వాస్తవమ్ము నార్లవారి మాట

•

తప్పు త్రోవ బట్ట దగవాడి మగనిని
దిద్దనట్టి భార్య దిష్టిబొమ్మ :
గంగిగోవు కంటె గడుసరి మేలోయి !
వాస్తవమ్ము నార్లవారి మాట

సుందరాంగియైన, సురకాంతయైనను
నెయ్య మెఱుగకున్న కొయ్యబొమ్మ :
అందకత్తెకంటె అనురాగవతి మేలు
వాస్తవమ్ము నార్లవారి మాట

ఎట్టి పేదయైన గట్టి వలపుతోడ
చెట్టవట్టెనేని శీలవతిని
కట్టవచ్చు మేడ కల్పవృక్షము నీడ
వాస్తవమ్మొ నార్లవారి మాట

అలక పెంచు వలపు నాలుమగలమధ్య :
కలతలైన వారి వలపు పెంచు ;
అసలె వలపు లేద ? అది వేఱు మాటరా !
వాస్తవమ్మొ నార్లవారి మాట

భర్త చిత్త మెఱిగి వర్తింప నేర్చిన
భార్యయున్న వేఱె స్వర్గ మేల ?
అన్న మెందుకోయి అమృతమే నీకున్న ?
వాస్తవమ్మొ నార్లవారి మాట

నరుడులేక నారి చరితార్థ కాలేదు
నారిలేక నరుడు క్రూరుడౌను :
నలువ కలలపంట నారీనరుల జంట
వాస్తవమ్ము నార్ల వారి మాట

చదువు సంధ్యలేల సరసత లేకున్న ?
వ్రాత కోతలేల నీతి లేక ?
తెలివితేటలేల మెలకువ లేకున్న ?
వాస్తవమ్ము నార్ల వారి మాట

పుస్తకాలు చేర్చి పూజింప రెవ్వరు
విద్య లెల్ల దెలియు విబుధు డనుచు :
వీణలున్న మాత్ర వైణికు డందురా ?
వాస్తవమ్ము నార్ల వారి మాట

విద్య లెన్నియైన విజ్ఞాన మొక్కటె :
భాష లెన్నియైన భావ మొకటె ;
రచన లెన్నియైన రసధుని యొక్కటే !
వాస్తవమ్ము నార్లవారి మాట

భాష బలముబట్టి భావనాబల ముండు ;
భావ బలముబట్టి భాషబలము ;
గుండె దిటవుబట్టి రెండింటి బలమురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

అన్యభాషపైని అధికార మబ్బదు
అంతుపట్టదేని సొంతభాష :
మొదలు నేర్వకున్న తుద నెట్లు నేర్చురా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

ఉండు భేషజమ్ము పండితమ్మన్యులో ;
ఉండు నెంతో మొండి బండతనము ;
ఉండనట్టి దొక్క నిండైన హృదయమే !
వాస్తవమ్ము నార్లవారి మాట

మొగ్గ, పూవు, పిందె పుట్లు పుట్లుగ రాల్చ
గట్టికాయ లేవొ చెట్టునుండు :
ఎంతొ వ్రాసినపుడె కొంతేదొ మిగులురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

కవికి చెల్లు సుమ్ము కనికట్టు విద్యలు;
కవికి చెల్లు పసిడికలల పంట;
కవికి చెల్లు నోయి కాలాని కెదురీత!
వాస్తవమ్ము నార్లవారి మాట

వాస్తవమ్ము...

విప్లవమ్ము కవిత వేషధారణపైని ;
విప్లవమ్ము కవిత విభుతపైని ;
విప్లవమ్ము కవిత విధివిపాకముపైని
వాస్తవమ్ము నార్లవారి మాట

ముదిమి లేదు కవికి, మునిమాపులును లేవు ;
నిదుర లేదు కవికి, నిన్న లేదు ;
ఎదల నేలు కవికి కొదువ లేవియు లేవు
వాస్తవమ్ము నార్లవారి మాట

కావ్య మొకటె చాలు కలకాలమున్నచో ;
పద్య మొకటె చాలు బ్రతికెనేని ;
పాద మొకటె చాలు పసగలదైనచో
వాస్తవమ్ము నార్లవారి మాట

ఆదిలో చదువరి కాళలు గొలిపియు
రసము జిందలేవు రచన లన్ని :
కారుమబ్బు లన్ని జోరుగా కురియునా ?
వా_స్తవమ్ము నార్లవారి మాట

మెచ్చరాని తనదు పిచ్చి కవితకూడ
కవికి తోచు కావ్య కన్యగానె !
మమత చేయు నెట్టి మాయగారడినైన !
వా_స్తవమ్ము నార్లవారి మాట

పలుకరింపరాదు పనిపాటు లున్నచో
కబ్బ మల్లు జబ్బుగల్లువాని :
విడిచిపెట్ట కతడు వినిపించు పద్యాలు !
వా_స్తవమ్ము నార్లవారి మాట

కవులు వేనవేలు కాళిదా సొక్కడు ;
బుధులు వేనవేలు బుద్ధు డొకడు ;
ఘనులు వేనవేలు గాంధిమాత్ర మొకండు
వాస్తవమ్ము నార్లవారి మాట

వస్తువునను కొంత వాస్తవికత లేక
రసము జిందలేవు రచన లేవి :
ఉత్త చెట్టు కాయ నుత్తుత్త కాయలే
వాస్తవమ్ము నార్లవారి మాట

వ్రాయబోడు సుమ్ము వాల్మీకి నేడున్న
రఘుకులమ్ముగూర్చి, రాముగూర్చి :
ప్రజకు నే డతండు పట్టమ్ము గట్టును
వాస్తవమ్ము నార్లవారి మాట

గుండెచెవులలోన గుసగుస లాడెడి
నేర్పుచూపు రచనె నిలుచు నిలను :
అంకెవేయు రచన రాణింపు కొన్నాళ్లె
వాస్తవమ్ము నార్లవారి మాట

తేలిపోయిన కల, రాలిపోయిన పూవు,
సాగనట్టి రచన, మూగ గొంతు,
ఎగురలేని పక్షి ఎంత జాలిని గొల్పు !
వాస్తవమ్ము నార్లవారి మాట

చరితయనగ కాదు సామ్రాజ్యకీర్తన ;
చరితయనగ కాదు సమరగాథ ;
చరితయనగ సకల నరజాతి ప్రగతిరా !
వాస్తవమ్ము నార్లవారి మాట

వార్తలోన తొణకు వర్తమాన చరిత ;
వార్త నాప నీలివార్త పుట్టు ;
వార్త నణచువాడు స్వాతంత్ర్యశత్రువు
వాస్తవమ్ము నార్లవారి మాట

వార్తనేకమౌను ప్రాక్పశ్చిమమ్ములు ;
వార్తవలన స్వేచ్ఛ పరిధి పెరుగు ;
వార్తలేక వసుధ వర్ధిల్ల నేరదు
వాస్తవమ్ము నార్లవారి మాట

ప్రజల సరస నిలిచి ప్రధనమ్ము నడపుట
ప్రథమ ధర్మమోయి పత్రికలకు :
ప్రజల గొల్వలేని పత్రిక లేలరా ;
వాస్తవమ్ము నార్లవారి మాట

ప్రతిఫలింపవలెను పత్రిక జగతిని ;
ప్రతిఘటింపవలెను ప్రల్లదనము ;
ప్రగతి సాధనమ్మె పత్రికాధర్మము
వాస్తవమ్ము నార్లవారి మాట

పత్రి కొక్కటున్న పదివేల సైన్యము ;
పత్రి కొక్కటున్న మిత్రకోటి ;
ప్రజకు రక్ష లేదు పత్రిక లేకున్న
వాస్తవమ్ము నార్లవారి మాట

పత్రికయె నియంత పక్కలో బల్లెమ్ము ;
పత్రికయె ప్రజాళి పట్టుగొమ్మ :
ప్రభుత వక్రమౌను పత్రిక లేకున్న
వాస్తవమ్ము నార్లవారి మాట

పత్రికా రచయిత ప్రతిహారిగా నిల్వ
అవని నిద్రపోవు నాదమఱచి ;
అతడు నిద్రపోవ గతియించు భద్రత
వాస్తవమ్మ నార్లవారి మాట

నీతి నియతిలేని నీచుని చేతిలో
పత్రికుండెనేని ప్రజకు ముప్పు :
ఉండదగునె కత్తి చండాలు చేతిలో ?
వాస్తవమ్మ నార్లవారి మాట

చెలువ మమ్మకొనుట వెలయాలితనమైన
అంతె సుమ్ము కలము నమ్మకొనుట :
వేశ్యవృత్తి సాగు వేలాది రూపాల
వాస్తవమ్మ నార్లవారి మాట

తగదు తగదు సుమ్మ తాటస్థ్య వైఖరి
మచ్చ గలుగుచుండ మానవతకు :
మిన్నకుంట తగునె మిన్ను విఱుగుచుండ ?
వాస్తవమ్ము నార్లవారి మాట

చిత్తశుద్ధితోడ స్వేచ్ఛగా మెలగిన
లోకనింద కొంత రాకయున్నె ?
నిందయన్న భయము పందకే తగునురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

మనసునందు శాంతి మటుమాయమైనచో
ముజ్జగమ్ములందు పూజ్యమౌను :
లోనలేని శాంతి లోకాల నుండదు
వాస్తవమ్ము నార్లవారి మాట

విప్లవమ్ము సాగు వివిధ రూపమ్ముల ;
సాగు నది యదృశ్యసరణి నైన ;
సాగవచ్చు శాంతి సమ్మతమ్ముగనైన
వాస్తవమ్ము నార్లవారి మాట.

వర్గకలహ మొకటె స్వర్గమార్గము కాదు ;
ప్రగతి లేదు రక్తపాతమందె ;
మార్క్సుదారి యొకండె మార్గదర్శియు కాదు !
వాస్తవమ్ము నార్లవారి మాట

కోతులున్నవారె క్రూరరాక్షసులన్న
విశ్వసింపబోరు విజ్ఞులెవరు :
నరులలోనె కలదు నరకాసురుల జాతి
వాస్తవమ్ము నార్లవారి మాట

బహుముఖమ్ము లీను బహువర్ణ కాంతుల
స్ఫటికమై విశుద్ధసత్య మలరు:
సత్య మిందువలన నిత్యనూతన మౌను
వాస్తవమ్ము నార్లవారి మాట

సత్య మున్నచోట సౌందర్య ముండును;
సత్య మున్నచోట శాంత ముండు;
సత్య మున్నచోట సర్వేశు డుండురా!
వాస్తవమ్ము నార్లవారి మాట

గరిమ తగ్గి నిజము మఱుగున బడిపోవు
తిరిగి తిరిగి ఋజువు పఱుపకున్న:
పసిడికైన వలయు పలుమార్లు మెఱుగులు
వాస్తవమ్ము నార్లవారి మాట

మంచి పుష్టియున్న మఱ్ఱివిత్తనమైన
మంటిలోన బడక మ్రాను గాదు :
ప్రజలలోన బడక ప్రబలునా సత్యము ?
వాస్తవమ్ము నార్లవారి మాట

సత్యపథము మెట్టు శక్తివంతుల సంఖ్య
సర్వయుగములందు స్వల్ప మోయి !
సత్యము విషమౌను శక్తిహీనులపట్ల !
వాస్తవమ్ము నార్లవారి మాట

సత్యమందు మోహక సంగీత ముండును ;
సత్యమం ధదృశ్య శక్తు లుండు :
సత్యమందె శివము నిత్యమై యుండురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

నిర్దయాత్ముడైన నీతిపరునికంటె
కరుణ చూపగల్గు ఖలుడె మేలు :
కరుణలేని నీతి నరకసీమకె చెల్లు
వాస్తవమ్ము నార్లవారి మాట

ఏడిపించు నొకడు వేడుక జూడగా ;
ఏడిపించు నొకడు కీడు గోరి ;
ఏడిపించు నొక్క డెడదల గరగించి
వాస్తవమ్ము నార్లవారి మాట

రాజనీతి పేర రక్తపు టేఱులు
పాఱజేయనట్టి ప్రభు డెవండు ?
రాజనీతిలోన రాక్షసత్వము దాగు
వాస్తవమ్ము నార్లవారి మాట

పాపభీతి లేక ప్రాబల్య సాధనే
రాజనీతి పరమ లక్ష్య మౌను :
రాజనీతి ప్రబలు రక్తపానముతోడ
వాస్తవమ్మొ నార్లవారి మాట

రాజనీతికుండు రాబందు రెక్కలు ;
రాజనీతికుండు ఆటి గుండె ;
రాజనీతికుండు రాకాసి బుద్ధులు
వాస్తవమ్మొ నార్లవారి మాట

కత్తితెచ్చు గెలుపు కత్తితోనే నిల్చు
కత్తి కోరుచుండు క్రొత్త బలిని ;
కత్తి పెట్టనేర్చు నెత్తురుకూటినే !
వాస్తవమ్మొ నార్లవారి మాట

నఱకనేర్చు కత్తి యిరువాగులందును ;
పగతు తలను ద్రుంచు పట్టునందె
నేల కొఱగజేయు నీలోన కొంతేదొ !
వాస్తవమ్ము నార్లవారి మాట

కత్తి బలము జూపు ; కాదవ తే మది ;
కత్తికుండు గాదె మిత్తి చెలిమి ?
మిత్తి బెదరు తీఱు, కత్తి పూచికపుల్ల !
వాస్తవమ్ము నార్లవారి మాట

ఎన్ని సేమసైన వేలఱాలుడు వంచు
విచ్చుకత్తి విఱ్ఱవీగు గాక,
గదిమి యేలగలదె హృదయసీమ నొకింత ?
వాస్తవమ్ము నార్లవారి మాట

కల్లు చాలులోన కందళించు బ్రతుకు;
కత్తినీడ మిత్తి కాపురమ్ము;
కత్తి ముందు గెల్వ, కడకు గెల్చును కల్లు!
వాస్తవమ్ము నార్లవారి మాట

తిక్కన కొంత లేక తెలుగువాడెట్లౌను?
తెలుగుదనము లేదు తిక్కలేక;
తెలుగుజాతి కవియె తిక్కనామాత్యుండు
వాస్తవమ్ము నార్లవారి మాట

ముందు చెప్పవలెను మూల్లోకములలోను
సర్వసమత కాంధ్రజాతివాని;
సర్వజనుల సత్వడు సత్యమ్ముగా నిరసించు
వాస్తవమ్ము నార్లవారి మాట

తెలివి నొకరికొకరు తీసిపోనందున
తెలివి మెచ్చుకొనరు తెలుగునేల :
స్వర్గమందు సురుడు సామాన్యపౌరుడే !
వాస్తవమ్ము నార్లవారి మాట

తెలుగువాడు కాడు, తీవరపడకున్న ;
తెలుగువాడు కాడు, తెగడకున్న ;
తెలుగువాడు కాడు; తెగు లేదో లేకున్న
వాస్తవమ్ము నార్లవారి మాట

నగరమందె సుమ్ము నరజాతి శోభించు ;
నగరమందె పుట్టు నాగరికత ;
నగరవాసమున్న తెగనాడనేలరా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

తెల్లవాని మాట యెల్ల సీమలలోన
చెల్లినట్టి రోజు వెళ్ళిపోయె:
ఎల్లకాల మెవ్వ డేలంగ నేర్చురా?
వాస్తవమ్మ నార్లవారి మాట

తెల్ల, నల్ల, పచ్చ తెగలుగా జగతిని
పంచినంతవఱకు పొంచియుండు
నరుని తుడిచిపెట్టు పరమ విద్వేషమ్ము
వాస్తవమ్మ నార్లవారి మాట

నార్లు పోయువాడె నీర్లు పోయుననెడి
సూత్ర మెంత జ్ఞాన శూన్య మోయి!
నీరు పోయువాడె ఆరగింపడె పంట?
వాస్తవమ్మ నార్లవారి మాట.

వేలు విధములైన విశ్వాసములతోడ
వేలునడక నడచువారి కెల్ల
వేరుపురుగు లనుచు పేరు పెట్టుదురోయి !
వాస్తవమ్ము నార్లవారి మాట

చందమామ చేతి కందలేదను చింత
శైశవమ్ముతోనె సమసిపోక,
దిక్తటాలు చేర తెరచాప లెత్తించు !
వాస్తవమ్ము నార్లవారి మాట

ద్వేషబుద్ధి కేదో విలుగు దుండును గాని,
ఈర్ష్య మాన్ప నేర దీశుడైన :
ఈర్ష్యకంటె లేదు హేయమైన గుణమ్ము
వాస్తవమ్ము నార్లవారి మాట

వృద్ధినందు ప్రేమ విఘ్నము లేర్పడ ;
విస్తరించు ప్రేమ విఫలమయ్యె ;
విక్రమించు ప్రేమ విధి వక్రమైనచో
వాస్తవమ్మ నార్లవారి మాట

పిచ్చివానిపగిది ప్రేమింపకున్నచో
చేరలేరు ప్రేమచెంతకైన :
నీరసింప జేయు గోరువెచ్చని ప్రేమ
వాస్తవమ్మ నార్లవారి మాట

తుష్టిలేని ప్రేమ సృష్టిని ముంచెత్తు ;
తుష్టి నందినంత ముష్టి దౌను ;
తుష్టిలేని ప్రేమె సృష్టికి మూలము
వాస్తవమ్మ నార్లవారి మాట

ప్రేమ గుడ్డిదనుచు పామరు లన్నంత
తఱుగబోదు ప్రేమగరిమ సుంత :
ప్రేమదృష్టి కందు విశ్వాంతరాళము
వాస్తవమ్ము నార్లవారి మాట

ప్రేమ కొక్క డిచ్చు ప్రేయసి రూపమ్ము :
ప్రేమ నొకడు చూచు పృథ్వి నెల్ల :
ప్రేమ నొకడు నిల్పు విశ్వైకపీఠాన
వాస్తవమ్ము నార్లవారి మాట

తల్లి ఱొమ్ములందు స్తన్యమ్ము పొంగుట
బిడ్డపైని చిందు ప్రేమతోనె :
ప్రేమ కారణాన పృథ్వి శ్రీలను చిందు
వాస్తవమ్ము నార్లవారి మాట

క్షమకు ప్రేమతోడ సంబంధ మున్నది ;
ప్రేమబట్టి క్షమయు పెరుగుచుండు ;
చిలుకలేదె క్షమను సిలువనుండియు క్రీస్తు ?
వాస్తవమ్ము నార్లవారి మాట

ప్రేమవృష్టికంటె విభవ మేమియు లేదు ;
ప్రేమకొఱతకంటె లేమి లేదు ;
ప్రేమ యున్నవాని ప్రేమించు లోకమే :
వాస్తవమ్ము నార్లవారి మాట

పణము నిచ్చి పరుల ఋణమును దీర్పగా
ఎల్ల వేళలందు వల్లగాదు :
పణము గలదె ప్రేమఋణమును దీర్పగా ?
వాస్తవమ్ము నార్లవారి మాట

"కావలె" ననుమాట కామమ్ము జపియింప,
ఇచ్చుగాని ప్రేమ పుచ్చు కొనదు :
కామము కబళించు ; ప్రేమ పోషణ జేయు
వాస్తవమ్ము నార్లవారి మాట

ప్రేమ మహిమగూర్చి వేమాఱు చెప్పియు
చెప్పలేము సుమ్మ చివరిమాట :
ప్రేమ కదపకున్న చీమైన కదలదు :
వాస్తవమ్ము నార్లవారి మాట

ప్రేమముందు భక్తి పేలవం బెంతయు ;
భక్తి నెఱపలేరు భయములేక ;
సములమధ్య భక్తి సాధ్యమ్ము కాబోదు
వాస్తవమ్ము నార్లవారి మాట

భక్తి గొల్వలేరు భగవంతునైనను
భక్తితోడ కలిసి భయము లేక ;
భయముపాలె హెచ్చు భయభక్తులందున
వాస్తవమ్ము నార్లవారి మాట

నమ్మకాల కొక్క డమ్ముడై పోవును ;
అమ్మ జూపు నొకడు నమ్మకాలు ;
నమ్మకాల కొకడు నామాలె పెట్టురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

నమ్మకాలకొఱకు నష్టేట ముఱికెడి
దమ్ములున్నవాడె ధరను గెలుచు ;
వెన్నుచూపువాడు సన్నాసి యౌనురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

"రైలు" చెరిపివేసె రాష్ట్రాల హద్దులు ;
కలిపివేసె "ప్లేను" ఖండములను :
నరునిలోని "ఇనుప తెర" లింక కలపురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

ప్రకృతినే జయించి, పరమాణువును చీల్చి
శాస్త్రవేత్త కూర్చె సకల సిరులు :
రాజకీయవేత్త రణమును కూర్చెరా !
వాస్తవమ్ము నార్లవారి మాట

నరుడు తినడుగాని నరమాంస మీనాడు
బ్రతుకగోరు పరుల బ్రతుకు కాల్చి ;
కరుణలేని నరుడు నరహంత కాదొకో !
వాస్తవమ్ము నార్లవారి మాట

కరుణ వెల్లివిరియ కర్కశ శిలలైన
కదలి, కరగి, జీవకళల దేలు :
కరుణలేని జగతి నిరయమ్మునకె సాటి !
వాస్తవమ్ము నార్లవారి మాట

ఏరులై పొరలెడి కారుణ్య మొక్కటే
నరుని సురుని చేయు పరుసవేది :
అసురు డనగ కరుణ కెసరు పెట్టెడివాడె !
వాస్తవమ్ము నార్లవారి మాట

సగము స్వేచ్ఛతోడ, సగ మేమొ దాస్యాన
జగతి యున్నదనుక ప్రగతి కలదె ?
అభ్యుదయపు స్వేచ్ఛ అవిభాజ్యమైనదే !
వాస్తవమ్ము నార్లవారి మాట

ఒక్కచోట శాంతి, ఒకచోట యుద్ధము
పరగుచున్న జగతి వరలగలదె ?
అభయమిచ్చు శాంతి అవిభాజ్యమైనదే !
వాస్తవమ్ము నార్లవారి మాట

వర్తమాన జగతి వ్యాధులన్నింటికి
ఔషధమ్ము సుమ్ము సోషలిజము :
సోషలిజమె సర్వ శుభముల గూర్చురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

సోషలిజము పెంచు సోదరభావమ్ము :
సోషలిజము త్రుంచు బాధలెల్ల :
సోషలిజముచేత శోషణమే లేదురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

సోషలిజము దృష్టి శూద్రులనుచు లేరు ;
దాని దృష్టి లేరు ధరణిసురులు ;
సోషలిజము భేదశూన్యమై చెలగుం ;
వాస్తవమ్ము నార్లవారి మాట.

సోషలిజము వేదసూక్తమై చెల్లక
వర్ధమానమౌనె వసుధ నేడు ?
సోషలిజమె నేటి సుశ్లోక మతముగా !
వాస్తవమ్ము నార్లవారి మాట

మార్పు లొందుచున్న మానవసంఘాన
సోషలిస్టు కాని శూద్రనరుడు
మానవతకె నేడు మచ్చను తెచ్చురా !
వాస్తవమ్ము నార్లవారి మాట

సాహసించి క్రొత్త సత్యమ్ము చాటిన
చంపగలరు సంఘ శత్రు వనుచు :
గ్రీసులోన సోక్రటీసు కేమి జరిగె ?
వాస్తవమ్ము నార్ల వారి మాట

శాంతి, ప్రేమ విలువ స్థాపింపగోరిన
పట్టి చంపగలరు పాపు లెవరొ :
ఏసుక్రీస్తు సిలువ నెక్కింపరే మున్ను
వాస్తవమ్ము నార్ల వారి మాట

హింస కూడదనుచు హితబోధ
కోపగించి చంపు కూళ యెవడొ :
కాల్చి చంపలేదె గాంధియంతటివాని ?
వాస్తవమ్ము నార్ల వారి మాట

గుడ్డి నమ్మకాల నడ్డి విఱుగదన్న
వెంటబడుదు రోయి వెఱ్ఱి యనుచు :
వెఱ్ఱియనెడి వాదు వేమన్నకే వచ్చె
వాస్తవమ్ము నార్లవారి మాట

విశ్వకవివి నీవు వేమన యోగీంద్ర :
నిత్యసత్య మోయి నీదు వాక్కు :
నీవు దయ దలంచి దీవించుచో — ఔను
వాస్తవమ్ము నార్లవారి మాట